# హైదరాబాద్ హత్యలు
# నిజం చెప్పలేని నేతలు




రాంమాధవ్

నవభారతి ప్రచురణలు

ప్రథమ ముద్రణ:
1 జనవరి, 1991.

ప్రచురణ:
నవభారతి ప్రచురణలు,
3-4-705/4, నారాయణ
గూడ,
హైదరాబాద్ - 500 029.

ముద్రణ:
భారత ముద్రణాలయం,
నారాయణగూడ,
హైదరాబాద్ - 500 029.

ప్రతులకు:
సాహిత్య నికేతన్,
3-4-852, బర్కత్‌పురా,
హైదరాబాద్ - 500 027.

వెల: రూ.2.00 లు

# ముందుమాట

హైదరాబాదులో అక్టోబరు, నవంబరు, డిసెంబరు నెలల్లో జరిగిన మారణకాండకు కారకులెవ్వరు? ఈ ప్రశ్నకు సమాధానం అందరికీ తెలిసినా, ఎవ్వరూ వాస్తవాలను బయటకు చెప్పటంలేదు. ముఖ్యంగా వివిధ రాజకీయపక్షాల నాయకులు నిజంచెప్పటానికి భయపడుతున్నారు. కారణాలు ఏమైనాకావచ్చు. పత్రికలు కూడ వాస్తవాలను స్పష్టంగా ప్రకటించ లేకపోయాయి. అయితే ప్రజలకు ఈ వాస్తవాలు తెలియవలసిన అవసరం ఎంతైనా ఉంది. తమ స్వార్ధరాజకీయ లబ్ధికోసం అయోధ్యలోని కరసేవకు దీనిని ముడిపెట్టటానికి ప్రయత్నిస్తున్నారు మరొకవైపున. అందువలన ఈ చిన్న పుస్తకాన్ని సత్యాన్ని ప్రచారం చేయటంకోసం ప్రచురిస్తున్నాం. రచయిత శ్రీ రాంమాధవ్‌కు కృతజ్ఞతాపూర్వక వందనాలు.

వాస్తవాలను గ్రహించిన పాఠకులు ఈ అల్లర్లలో తమ ఆస్తులను, బంధువులను కోల్పోయిన వారికి తమకు చేతనయిన సహాయాన్ని అందించమని మనవి.

ప్రమోద పుష్య శు.ఏకాదశి
ముక్కోటి ఏకాదశి — **ప్రకాశకులు**
28-12-1990
భాగ్యనగర్

# భగ్గుమంది భాగ్యనగరం మరొకసారి

భాగ్యనగర వాసులకు ఇదేం కొత్తకాదు. ఆమాటకొస్తే దేశంలో ఎవరికీ కాదు. నిజానికి భాగ్యనగర్‌లో గత 6సం.లుగా మతకలహాలు లేవేమిటని ఆశ్చర్యపడే వారే ఎక్కువమంది కనబడతారు.

'భాగ్యనగర్ యొక్క అపురూపమైన మతసామరస్యచరిత్ర భగ్నమైపోయింది!' అంటూ దొంగ కన్నీళ్ళు కారుస్తూ, ఉపన్యాసాలు దంచుతున్నారు పాసుమంత రావులు, ఒవైసీలు.. భాగ్యనగర్ చరిత్ర తెలిసిన ప్రతీవారు వీళ్ళని అజ్ఞానులుగానే పరిగణిస్తారు.

మతసామరస్యం అనేది భాగ్యనగర్ వాసులకు ఎండమావి. ఆమాటకొస్తే అలీఘర్‌వాసులకు, మొరాదాబాద్ ప్రజలకు, కాన్పూరు నివాసులకు, జంషెడ్‌పూర్ జనాలకు .... వీరందరికీ కూడా అది ఎండమావి మాత్రమే.

కారణం జగద్విదితం. ఎక్కడెక్కడ దేశంలో ముస్లింలు అధికసంఖ్యలో ఉంటారో అక్కడ ఇక మతసామరస్యం, పరమత సహిష్ణుత లాంటి మాటలు బ్రతికి బట్ట కట్టడం అసాధ్యం. అధికసంఖ్యలో అంటే 'అధికసంఖ్యాకులుగా' అని పొరపాటు పడతారేమో! నూటికి యాభైమంది ముస్లింలు అవసరం లేదు. నూటికి 15 మందికి మించి వారి జనాభా పెరిగితే చాలు! ఇక ముస్లిమేతరులు రోజులు లెక్కపెట్టుకోవలసిందే.

దేశమంతా జరుగుతున్న కథే భాగ్యనగర్‌లో కూడా జరుగుతూ వస్తోంది.. మతసామరస్యం, సెక్యులరిజం లాంటి నినాదాలన్నీ నీటిపై రాతలుగానే మిగిలిపోతున్నాయి. తరచు మతకలహాల మహమ్మారి విజృంభిస్తూనే ఉంది. ప్రజాజీవనం దుర్భరమౌతూనే ఉంది.

అదే వరుసలో తాజాగా ఈమధ్యన చెలరేగిన కలహాలు కూడా అనేక ప్రాణాలను బలిగొన్నాయి. గతంలో జరిగిన కల్లోలాలకు, ఈసారి కల్లోలాలకు మధ్య కొంత వ్యత్యాసం ఉంది. ప్రధానమైనది పరిమాణం, ఈసారి జరిగినంత తీవ్రస్థాయిలో హిందువులపై ఇంతకు ముందెప్పుడూ... ఆఖరికి నైజాం పరిపాలనకాలంలో కూడా ఇలాంటి దాడులు జరగలేదు. అలాగే పెద్దసంఖ్యలో మరణాయుధాలు ధరించి మూకుమ్మడిగా ముస్లిం గూండాలు ఒకేసారి అనేక హిందూబస్తీలపై దాడి చేయడం కూడా గతంలో చాలా అరుదు. గతంలో మతకలహాలలో ఎక్కువగా కత్తులను మాత్రమే ఉపయోగించారు. కాగా ఈసారి సరికొత్తగా పొడవాటి తల్వార్‌లు,

చర్మాన్ని తినివేసే ఆసిడ్లు, పెట్రోలు పోసి సజీవంగా దహనం చేయడం మొదలైనవి కూడా ప్రారంభం అయ్యాయి.

ప్రతిసారి ముస్లింలే దాడికి పూనుకుంటూ ఉంటారు. ప్రతిసారి అధికంగా ఆస్తిని, ప్రాణాలను కోల్పోయేది నిరపరాధులైన హిందువులే. ఈసారి కూడా అదే జరిగింది. అయితే చాలా ఎక్కువ పరిమాణంలో....

# మొదలెక్కడ?

మొదలెక్కడ?..... ఈ ప్రశ్నకు సమాధానం దొరకడం కొద్దిగా కష్టమైన విషయమే. రేపు ఏదైనా విచారణ సంఘం విచారణ జరిపి, లోతుగా పరిశీలిస్తే మాత్రమే దీనికి ఖచ్చితమైన సమాధానం లభించవచ్చు.

అయితే ఒకటి మాత్రం స్పష్టంగా చెప్పవచ్చు. దాదాపు 2 నెలల క్రితం అక్టోబర్ 10 వ తేదీన మహమ్మద్ సర్దార్‌ఖాన్ అనే పేరుమోసిన గూండా పోలీసులతో జరిగిన ఘర్షణలలో మరణించిన నాటి నుండి హిందువులపై దాడులు ప్రారంభమయ్యాయి.

మహమ్మద్ సర్దార్‌ఖాన్ మరణానికి, భాగ్యనగర్ పాతబస్తీలో ఉండే హిందువులకు ఉన్న సంబంధం ఏమిటో భగవంతుడికే ఎరుక!.... కాదుకాదు... ముస్లిం గూండాలకే ఎరుక.

మక్కాలో ముస్లింలు, ముస్లింలే కొట్టుకుంటే పాతబస్తీలో హిందువులను మట్టు పెట్టినవారికి, శ్రీనగర్‌లో ఒక వెంట్రుక కనిపించకుండా పోతే హైదరాబాద్‌లో హిందువుల తలలునరికిన ఘనులకు సర్దార్‌ఖాన్ హత్యకు, హిందువులకు లంకెపెట్టడం పెద్దకష్టంగా కనిపించ లేదు. పాతబస్తీ అంతటా నల్లజెండాలు ఎగురవేశారు. రోడ్లమీద విచ్చలవిడిగా వ్యవహరించారు. కొన్నిచోట్లబంద్ కూడా చేయించారు.

ఇదంతా ఎవరి కోసం! పేరుమోసిన గూండా, హంతకుడు మహమ్మద్ సర్దార్ మృతికి సంతాపం తెలియజేయడం కోసమే! ఎవరీ సర్దార్.....!

హైదరాబాద్ పోలీసులకు పెద్దతలనొప్పిగా ఉంటూ, లెక్కలేనన్ని హత్య, లూటీ, మానభంగం లాంటి నేరాలలో ప్రధాన నిందితుడిగా ఉండిన పేరుమోసిన రౌడీ మహమ్మద్ సర్దార్. రెండుసార్లు పోలీసు కస్టడీ నుండి పరారైన వ్యక్తిఇతడు. నగరంలోని పెద్దలనుసైతం బ్లాక్‌మెయిల్ చేసి డబ్బుగుంజడంలో సిద్ధహస్తుడు. స్వయంగా సిమెంట్‌కింగ్ సుబ్బరామిరెడ్డినే బ్లాక్‌మెయిల్ చేసి 4 లక్షలు రూపాయలు వసూలు చేసాడని ప్రజలు చెప్పుకుంటూ ఉంటారు. మెదక్ జిల్లాలోని ఒక

గ్రామంలో రహస్యంగా దాక్కున్న సర్దార్‌ను పట్టుకోవటానికి పోలీసులు వెళ్తే, వారిపైనే దాడి చేసి ఒక కానిస్టేబుల్‌ను కాల్చిచంపి పరారైన వాడు ఈసర్దార్.

ఇలాంటి రౌడీ షీటర్‌కు సంతాపం ప్రకటిస్తున్నామని చెప్పుకుంటూ, అనాటి నుండి హైదరాబాద్ నగరంలో విజృంభించి, అరాచకాలు సాగించిన పిండారీలు ఎలాంటి వారై ఉంటారో ఎవరైనా ఊహించవచ్చు.

సర్దార్ మరణించిన మరునాడే రంగారెడ్డి జిల్లా పహాడీషరీఫ్ వైపునుండి వస్తున్న ఒక ఆర్.టి.సి. బస్సును చాంద్రాయణగుట్ట దగ్గర దౌర్జన్యంగా నిలుపుచేసి, లోపల ఉన్న అమాయక గ్రామస్తులపై ఈ రజాకర్ల అనుయాయులు క్రూరంగా దాడిచేసారు. బస్సులోని 8మంది హిందూ ప్రయాణీకులను కత్తులతో పొడిచారు. కండక్టర్‌వద్ద ఉన్న కాష్‌బ్యాగ్‌ను గుంజుకుని పారిపోయారు.

అనాటినుండి పాతబస్తీలో ఈ గూండాల స్వైరవిహారం నడిచింది. సాయంత్రం చీకటి పడితే హిందువులు రోడ్డుపై అడుగు పెట్టలేని పరిస్థితి ఏర్పడింది. పట్టణవాసులు సాయంత్రంకాగానే తమ ఇండ్ల తలుపులు బిగించుకుని కూర్చునేవారు. పాపం! చుట్టుప్రక్కల గ్రామాలనుండి పనులమీదనో, పొట్టపోసుకోవడానికో పట్నానికి వచ్చి, చీకటిపడ్డాక తమ తమ గ్రామాలకు తిరిగి ప్రయాణమయ్యే అమాయక గ్రామీణులు ఈకసాయిల రక్తదాహానికి బలైపోయేవారు.

ఈ దారుణాలు ఎంత తీవ్రంగాకొనసాగాయంటే సర్దార్ మరణించిన నాటినుండి మొన్నటిఘర్షణల వరకు గల 2నెలలవ్యవధిలో సుమారు 25 రోజుల పాటు నగరంలో ఎక్కడో అక్కడ కర్ఫ్యూ కొనసాగింది. అక్టోబర్ 10 నుండి డిసెంబర్ 5వ తేదీ మధ్య నగరంలో 58 మంది ప్రజలు (పోలీసుల లెక్కల ప్రకారం) ఈ మతరక్కసికి బలైపోయారు.

సుమారుగా రెండునెలలుగా సాగుతున్న ఈమత మౌఢ్యంకారణంగా పాతబస్తీ ఉద్రిక్తంగా మారింది. అప్పటివరకు ముస్లిం గూండాలు యథేచ్ఛగా సాగించిన దారుణాలకు అడ్డుపడడానికి, హిందువులు కూడా సన్నద్ధం కావడం ప్రారంభించారు. అలాంటిసమయంలోనే సమర్థుడైన శ్రీగురునాథరావును రాజకీయకారణాలవల్ల నగర పోలీసు కమీషనర్‌గా తొలగించడం పోలీసుల నైతికస్థైర్యంపైన దెబ్బతీసింది.

ఈనేపథ్యంలో డిసెంబర్ 5వ తేదీ బుధవారం ఒక చిన్న సంఘటన జరిగింది. అదే తాజాగా మహాయుద్ధానికి కారణం అవుతుందని బహుశః ఆరోజున ఇరువర్గాలు ఊహించి ఉండవు.

# తాజా ఘర్షణలు

మజీదేఖాన్ అనే మజ్లీస్ పార్టీ కార్పొరేటర్ ఉన్నాడు. పాతబస్తీలో అనేక భూఆక్రమణలు, భూవ్యాపారలావాదేవీలతో ఇతడికి సంబంధం ఉందని పాతబస్తీవాసులు అంటారు. అలాంటి ఒక భూమిసంబంధమైన తగాదాకారణంగా ఎవరో ఈ మజీద్ఖాన్తో ఘర్షణ పడ్డారు. ఆ ఘర్షణలో మజీద్ఖాన్ గాయపడ్డాడు.

అంతే! ప్రళయం విరుచుకు పడింది.

జంక్షన్ల దగ్గర టీ దుకాణాలలో, బేకరీలలో, గల్లీలలో కాచుకుని కూర్చుని ఉండే జులాయి ముస్లింలు గూండాలు రోడ్లపైపడ్డారు. అనేకమందిపై దాడిచేసి కత్తులతో గాయపరచసాగారు. మంగళ్హాట్ ప్రాంతంలో ఒక ఆటోను నిలువుజేసి, లోపల ఉన్న ప్రయాణీకుడిని బైటకులాగి, పొడిచి చంపారు. గురువారం 6వ తేదీ అంతా ఉద్రిక్తతలు పెరుగుతూనే వచ్చాయి.

శుక్రవారం 7వ తేదీ వచ్చింది. శుక్రవారం ముస్లింలకు పవిత్రదినం. ఆరోజున వివిధ మసీదులలో పెద్దసంఖ్యలో ముస్లింలు చేరుతారు. నమాజ్ పేరిట రెచ్చగొట్టే ప్రసంగాలు జరుగుతాయి. ఆయుధాలుకూడా అక్కడే సిద్ధంగా ఉంటాయి. భావోద్వేగాలు తీవ్రస్థాయికి చేరుకున్న ముస్లిం మూకలు నమాజుకాగానే వీధినపడుతూ ఉంటారు.

అందుకే పాతబస్తీలోని హిందువులకి శుక్రవారం వస్తోందంటే భయం. ఏక్షణాన ఏంజరుగుతుందోనని వారు తల్లడిల్లుతూ ఉంటారు. అందులోనూ ఉద్రిక్తతలు ఉన్నరోజుల్లో నయితే ఇంక చెప్పవలసిన పనిలేదు. సరిగ్గా డిసెంబర్ 7వ తేదీ కూడా అదే జరిగింది. అసలే నగరం ఉద్రిక్తంగా ఉంది. అందులో మసీదులలో మరింతరెచ్చగొట్టే ప్రసంగాలు జరిగాయి. ఫలితంగా 7వ తేదీ పాతబస్తీ రణరంగంగా మారింది. ఒక మసీదులో మజ్లిస్నేత ఒవైసీ కూడా ప్రసంగించాడని, 'హమ్ ఇస్కో పాకిస్తాన్ బనాయేంగే' (మనందినిని - పాతబస్తీని - పాకిస్తాన్గా మార్చేద్దాం) అని రెచ్చగొట్టాడని వినికిడి.

పాతబస్తీలో అనేకచోట్ల ముస్లింలు హిందువులపై దాడులకు పాల్పడ్డారు. ముస్లింల దాడులలో సాధారణ కృత్యాలయిన గృహదహనాలు, లూటీలు, హింసాకాండ, కత్తిపోట్లు నిరభ్యంతరంగా కొనసాగాయి. అలా ప్రారంభమైన కలహాలు ఆ తరువాత 8, 9 తేదీలలో మరింత ఉగ్రరూపం ధరించాయి. చివరికి 10 రోజులపైగా కొనసాగాయి. పాతబస్తీ అంతా సుదీర్ఘంగా 10 రోజులపాటు కర్ఫ్యూలో మగ్గింది. (ఇంతకాలం పాటు కర్ఫ్యూవిధించడం ఇదే మొదటిసారి).

మొత్తం మీద 7వ తేదీ నుండి 12వ తేదీలోగా ప్రభుత్వలెక్కల ప్రకారం 1
మంది మరణించారు. వారిలో 99 మంది దాడులలో మరణించగా, 12మ
పోలీసుల కాల్పుల కారణంగా మరణించారు. ఖచ్చితంగా లెక్కలు చెప్పడం కష్టమే
దాడులలో ఎక్కువ మంది హిందువులే మరణించారని మాత్రం స్పష్టంగా చెప్పగ

అదీగాక ఇవి ప్రభుత్వం ఇచ్చిన గణాంక వివరాలు మాత్రమే. ఇవి
ఇంకాఅనేక హత్యలు పోలీసుల దృష్టికి వచ్చి ఉండకపోవచ్చు. మొత్తం
రజాకర్ల మారణకాండసమయంలో కూడా జరగనంతటి తీవ్రంగా ఈసారి కల
సంభవించాయి.

పాతబస్తీలోని సబ్జిమండి, టప్పాచబుత్రా, జుమేరాత్ బజార్, కుల్సుంపు
షక్కర్‌గంజ్, కూర్మగూడా, షంషేర్‌గంజ్, భవానీనగర్, తీగలకుంట, సుల్తాన్‌షా
ఛత్రినాక, లాల్‌దర్వాజా, తలాబ్‌కట్ట, అలియాబాద్, గౌలిపుర, ముషీరాబ
ప్రాంతాలు కలహాలతో అట్టుడికిపోయాయి. ఇవేగాక రంగారెడ్డి జిల్లాలోని
గ్రామాలలో కూడా కర్ఫ్యూ అమలు చేయవలసిన పరిస్థితి ఏర్పడింది.

# నెత్తుటి దినాలు

6,7 తేదీలలో ప్రధానంగా టప్పాచబూత్రా, కుల్సుంపురా పోలీస్‌స్టేషన్ల
పరిమితంగా ఉండిన ఈ ఘర్షణలు 8వ తేదీ సాయంత్రానికి పాతబస్తీ మొత్త
వ్యాపించాయి. విచ్చలవిడిగా కత్తిపోట్లు సాగాయి. 7వ తేదీన 17 మ
మరణించారు. దాంతో రాత్రి 8గం.ల నుండి పాతబస్తీ అంతటా పోలీసులు క
విధించారు.

మధ్యాహ్నం నుండి ముఖ్యమంత్రి మర్రి చెన్నారెడ్డి పాతబస్తీలో పర్యటించ
అయితే ఒక ప్రక్క ఆయన పర్యటన సాగుతూండగానే రెండవప్రక్క ఘర్ష
కొనసాగాయి. రక్తం ఓడుతూ, తీవ్రగాయాలతో, కొన ఊపిరితో పరిగెత్త
వస్తున్న జనాలతో, వారిబంధువులతో ఉస్మానియా ఆసుపత్రి నిండి పోయి
అనుకోని ఈ ఒత్తిడిని తట్టుకొనడానికి డాక్టర్లు నర్సులు నానా హడావుడి పడ
వచ్చింది.

ఇది చాలదన్నట్లు ముఖ్యమంత్రితో బాటు వచ్చిన మందీ మార్బలం కు
ఉస్మానియా ఆవరణలోకి ప్రవేశించడంతో గందరగోళం మరింత ఎక్కువై
శుక్రవారం నాటి ఘర్షణలలో ముస్లింలు అధికసంఖ్యలో దెబ్బతిన్నారు. ఆసుప
చేరిన ముస్లింల కోసం వచ్చిన మజ్లిస్ నేతలు అమానుల్లాఖాన్, సయ్యద్ స

విరాసత్ రసూల్ ఖాన్‌లు ఆసుపత్రిలోనే ముఖ్యమంత్రిని ఘెరావ్ కూడా చేశారు.

ఆ రాత్రికే పెద్ద పెద్ద ఎత్తున పథకాలు జరిగాయి. హిందువులను పాతబస్తీ నుండి తరిమికొట్టాలని, భయభ్రాంతులను చెయ్యాలని నిర్ణయం జరిగింది. స్వయంగా ఒవైసీ ఈ పథకాలలో పాలుపంచుకున్నట్లు వినికిడి. మామూలుగా జరిగే ఘర్షణల సందర్భంలో గతంలో ప్రతిసారి హిందువులు కూడా ఎదురుదెబ్బతీస్తున్నారు. కనుక ఈసారి అలాకాక పెద్దఎత్తున మూకుమ్మడిగా, తల్వార్‌ల వంటి మారణాయుధాలతో దాడిచేయాలని పథకం వేశారు. దాగులు కూడా అకస్మాత్తుగా జరగాలని, సాధారణంగా ప్రతిఘటన ఉండే బస్తీలపైన కాక, ఒంటరిగా, దూరంగా ఉండే హరిజన, గిరిజన బస్తీలపైనే పడాలని, తద్వారా ఎక్కువ ప్రతి ఘటన లేకుండానే తమలక్ష్యం నెరవేరగలదని వారు కుట్రపన్నారు.

పాపం ఈ హరిజనులు, గిరిజనులు, గతకొద్దికాలంగా ఎన్నికలలో మజ్లిస్ వారి కొమ్ముకాస్తున్నారు. ముస్లింలే మిగిలిన హిందువులకంటే ఎక్కువగా తమకు సన్నిహితులని వారు భ్రమపడుతూ వచ్చారు. హరిజనులైన ప్రకాశరావు. పోచయ్య వంటివారిని భాగ్యనగర మునిసిపల్ కార్పొరేషన్‌కు మేయర్లుగా చేసి మజ్లిస్ నేతలు వారిని మరింత విశ్వాస పాత్రులుగా చేసుకున్నారు. అలా ముస్లిం నేతలపై గల అపరిమిత మైన విశ్వాసంతో ఇంతకాలంగా ఈ నిరుపేద హరిజన గిరిజన ప్రజానీకం తమ ఆత్మరక్షణ గురించి అవగింజంతైనా ఆలోచించలేదు. అసలలాంటి సందర్భమంటూ వస్తుందని కూడా వారు భావించలేదు. అయితే మజ్లిస్‌పార్టీ మేకవన్నెపులి అని, అవకాశం చిక్కినప్పుడు దాని నిజమైన స్వభావాన్నది బైటపెడుతుందని వారు గ్రహించడానికి సమయం పట్టింది. అయితే అప్పటికే చాలా ఆలశ్యం అయింది. దుష్టులతో చేసిన చెలిమికి ఆ అమాయక హిందువులు పెద్దఎత్తున మూల్యం చెల్లించుకోవలసి వచ్చింది.

డిసెంబర్ 8వతేదీ... శనివారం...

ఆనాటి సంఘటనలను గురించి తెలియజేసే ముందు వాటిని గురించిపత్రికలు వ్రాసిన కొన్ని మాటలు మీ ముందుంచుతాను. దానిని బట్టి ఆ సంఘటనల తీవ్రత ఎంతటిదో మీరూహించుకోవచ్చు.

'కనీవిని ఎరుగని ఘోరకలి!!' 'నెత్తుటి చిత్తడి పాతబస్తీ'
'పసిబుగ్గలపై విచ్చుకత్తి' 'నెత్తుటి మడుగులో 'భాగ్య' నగరం'
'అట్టుడికి పోతున్న పాతబస్తీ' 'నగరవీధుల్లో నరమేధం'

-ఇవి నమూనా మాత్రమే. అయితే ఇవిచాలు... ఆరోజున సాగిన మారణ

హోమాన్ని వర్ణించడానికి....

శనివారం నాడు పాతబస్తీలో వీధివీధినా ముస్లిం గుండాలు విజృంభించారు. కర్ఫ్యూనిబంధనలు వారిముందు ఏమాత్రం నిలువలేక పోయాయి హత్యలు, గృహదహనాలు, లూటీలు, కత్తిపోట్లు విచ్చలవిడిగా జరిగాయి. పూర్వం రజాకర్ల హయాంలో హిందూయువతులను అపహరించుకుపోయిన ముస్లిం రజాకర్ల గురించి విన్నాం. తిరిగి మళ్ళీ ఈసారి నాగరిక భాగ్యనగరంలో ఆ సంఘటనలు పునరావృత్తం అయ్యాయి. కల్సుంపురా పరిధిలోని పంచబావి ఆల్వావద్ద ఒక 19 సం.ల యువతిని ముస్లిం కామాంధులు ఎత్తుకుని పోయారు. పసిపిల్లలు కూడా వారికరకు కత్తికి బలైపోయారు.

చాంద్రాయణగుట్టలో 20 మంది గూండాలు ఒక ఇంటిపై దాడిచేసి కత్తులు, తల్వార్‌లతో 4గురిని తీవ్రంగా గాయపరిచారు. వారిలో ఇద్దరు మరణించారు. ఆదే ప్రాంతంలో బిస్కట్లు కొనుక్కునేందుకని బైటకు వచ్చిన ఒక 10వ తరగతి బాలుడి పొట్టలోను, ఛాతీమీద, వీపుమీద పొడిచి హత్య చేశారు.

కేశవగిరి పోలీసుస్టేషన్‌కు కేవలం 40 గజాల దూరంలో ఉన్న కేశవగిరి హరిజన బస్తీపైన ముస్లిం గూండాలు దాడిచేసి బీభత్సం సృష్టించారు. కర్ఫ్యూభయంతో ఇళ్ళు బిగించుకుని కూర్చుని ఉన్న ఆ బస్తీలోని హరిజనుల మీద శనివారం సాయంత్రం 6గంటల వేళ 20 మంది దుండగులు మారణాయుధాలు ధరించి దాడిచేసారు. కత్తులు, తల్వార్లతో ఒక ఇంటిపైన దాడి చేసారు. ప్రాణభయంతో పరుగెడుతున్న ఒక వృద్ధుడిని చంపారు. అప్పుడే డ్యూటీనుండి వచ్చిన ఒక సి.ఆర్.పి. జవానును, ఇద్దరు రైల్వే ఉద్యోగులను సైతం ఈ దుండగులు గాయపరిచారు.

రంగారెడ్డిజిల్లా బాలాపూర్, పహాడీషరీఫ్‌లలో కూడా దుండగులు యధేచ్ఛగా స్వైర విహారం చేసారు. లూటీలు, గృహదహనాలు సాగించారు. బాలాపూర్‌లో హిందువులు ధనవంతులు, ఆస్తిపరులు. అయితే ముస్లింల దాడులకు, లూటీలకు వారు విపరీతంగా నష్టపోయారు. ఆఖరికి రంగారెడ్డి జిల్లా కలెక్టర్ అనిల్ కుమార్ కుట్టి కారును కూడా దుండగులు వదలలేదు. ఆయన అటెండర్‌ను కత్తులతో గాయపరచారు.

అయితే వీటన్నింటినీ తలదన్నే స్థాయిలో 8వ తేదీ రాత్రి షక్కర్‌గంజ్ పార్థీవాడ, జహానుమా వద్దగల తీగలకుంటలపై అరాచక మూకలు విరుచుకు పడ్డాయి. ఆ రాత్రి ఆ బస్తీలలోని ప్రజలకు కాళరాత్రి. అప్పటివరకు ఆనందంగా ఉన్న తమజీవితాలలోకి ఆరాత్రి అంధకారాన్ని తెస్తుందనిగానీ, కొద్దిక్షణాలలో తాము మృత్యు దేవతకు ఆహారం కాబోతున్నామని గానీ అమాయకులైన హరిజన గిరిజన

బస్తీప్రజలు ఊహించనైనా ఊహించలేదు.

రాత్రి సరిగ్గా 7-30 గం.లు దాటింది. అప్పుడే టి.వి.లో తెలుగులో వార్తలు ప్రారంభం అయ్యాయి. శనివారం టి.వి.లో హిందీ సినిమా ఉంటుంది కనుక ప్రతిఇంటిలోనూ ఇంటిల్లిపాది టి.వి. ముందు కూర్చుని ఉన్నారు. కొద్దిమంది వంటలకుపక్రమిస్తే, ఇంకొద్దిమంది భోజనాలముందు కూర్చున్నారు, సాధారణంగా ప్రతి శనివారం నగరమంతటా ఉండే దృశ్యమే ఇది.

షక్కర్‌గంజ్‌లోని పార్ధీవాడలో కూడా అదే దృశ్యం ఉంది. పార్ధీవాడలో మొత్తం 60 ఇళ్ళు ఉంటాయి. పార్ధీలుగా పిలువబడే గిరిజనులైన పిట్టలవాళ్ళు నివసించే బస్తీ ఇది. వారిలో అధిక శాతం ప్రజలు తోపుడు బండ్లపై పండ్లు, కూరగాయలు అమ్ముకుని జీవించే పేదప్రజలే. అయితే తినడానికి లోటుగానీ, జీవితాలకు ప్రమాదంగానీ లేకుండా సుఖంగా జీవితాలను వెళ్ళ బుచ్చుతున్న అమాయకులు వాళ్ళు.

రోజులాగే ఆరోజు కూడా బస్తీ అంతా దైనందిన వ్యవహారాలలో మునిగి ఉంది. తమపై మహాప్రళయం విరుచుకుపడనున్నదని వారికి లేశమాత్రంగా నైనా అనుమానం రాలేదు. పాతబస్తీలో మతకలహాలు జరుగుతున్నాయని వారికి తెలుసు. అయితే తాముండే మూడు వీధులు వాటికి గురియౌతాయని వారూహించలేదు. ఎందుకంటే తమబస్తీకి నలువైపులా ఉన్న ముస్లింలందరితో వారికి చక్కటి సంబంధాలున్నాయి. ఎంతవరకు అంటే రాఖీ పండుగరోజున బస్తీలోని స్త్రీలు ఏటా అనేకమంది ముస్లింలకు రాఖీలుకూడా కడతారు. అవతలివారు కట్టించుకుంటారు కూడా. రోజూ వ్యాపారులకోసంగానీ, ఏఇతర పనికోసంగానీ మెయిన్ రోడ్డుకు చేరాలంటే వారు ఆ ముస్లింల మధ్య నుండి వెళ్ళవలసిందే. ఇంతకాలం అలాగే జరుగుతూ వచ్చింది. అయినా ఏ ఇబ్బందీ కలుగలేదు. అందుకే వారు ధీమాగా ఉన్నారు.

రాజకీయంగా కూడా వారు ఎప్పుడూ స్వతంత్రంగా వ్యవహరించలేదు అసలు తాము హిందువులమనే ధ్యాసే వారికి లేదు. కనుక బైటి ఘర్షణల పట్ల పూర్తిగా ఉదాశీనంగా ఉండిపోయారు. ఈ ఉదాశీనతే వారిపాలిట యమపాశం అయింది. నిజానికి పార్ధీలు చాలా పరాక్రమవంతులు. రాజస్తాన్‌లోని రాజపుత్రల సంతతని పార్ధీల గురించి అనుకుంటూ ఉంటారు. చేతిలో ఆయుధం ఉంటే ఒక్కొక్క పార్ధీయువకుడు 10 మంది ముస్లింలపెట్టు. అదే అంటాడు ప్రకాష్ అనే ఆ బస్తీ యువకుడు. "మాకు ఒక్క 10 ని.ల ముందుగా దాడి జరుగుతున్నట్లు తెలిసినాచాలు. వీళ్ళ సంగతి తేల్చేవారం" అన్నాడు ఆవేశంగా ఆయువకుడు.

గిడ్డు మోహన్ కుటుంబసభ్యులందరినీ దుండగులు పొట్టనబెట్టుకున్నారు. పిల్లకు పాలిస్తున్న ఒక తల్లి రొమ్ములను కత్తిరించి పారేశారు. తమను ప్రాణాలతో విడిచిపెట్టమని ప్రార్థించిన ఒక తల్లి రెండు చేతులు నరికి పారేశారు.

వేరొక గల్లీలో ఉంటున్న బాలకిషన్ అనే లెక్చరర్ ఇంటిపైన దాడి చేశారు. అప్పటికి రాత్రి 9.30 గం.లు అయింది. బాలకిషన్‌ను, ఆయన భార్యను హత్య చేశారు. ఆమెను మానభంగం చేసి మరీ హత్య చేశారనిస్థానికులు కథనం. అనంతరం వారి శవాలను బెడ్‌రూంలోకి చేర్చి, పెట్రోలు పోసి తగులబెట్టారు. వారి ఇంటి ఆవరణలో ఉన్న లూనాను, స్కూటర్‌ను దగ్ధం చేశారు.

కళావతి అనే గృహిణిని కత్తులతో పొడిచి చంపారు. ఆమె కొనూపిరితో గిలగిలా కొట్టుకుంటూ ఉంటే, బైటకు ఈడ్చి, పెద్ద బండరాయిని ఆమె తలపై వేసి చంపారు. రక్తపుమరకలతో ఆబండరాయి ఇప్పటికీ మౌనసాక్షిగా అక్కడ నిలచి ఉంది.

బైట జరుగుతున్న అల్లరి చూసి ఒక కుటుంబం తలుపులు మూసుకున్నారు. ఇంతలో దుండగులు ఆ ఇంటిపైన కూడా దాడిచేశారు. ఇంట్లో చిన్నవాడు వెళ్ళి తలుపులు రాకుండా వాటికి బలంగా వీపు ఆనించి నిలబడ్డాడు. పశుబలంతో దూసుకు వచ్చిన మతోన్మాద మూకలు బైటనుండే గడ్డపలుగుతో పొడిచారు. తలుపుచెక్కలను చీల్చుకువచ్చిన ఆ గెడ్డపలుగు చిన్నవాడి వీపులోనుండి శరీరంలో దిగబడింది. అలాగే ప్రాణాలు విడిచాడా యువకుడు... ఇంట్లోకి చొరబడ్డ కసాయిమూకలు అడ్డువచ్చిన తండ్రిని నరకి పారవేశారు అతడి చెల్లెలు గుండెలుపగిలేలారోదిస్తూ తన అన్నను కాపాడడానికి వస్తే ఆమె గుండెల్లో తల్వారీ దిగబడింది. ఈ దృశ్యాన్ని కళ్ళారా జూసిన పెద్దకొడుకు ఇప్పటికీ ఆదృశ్యం తలచుకుని గజగజ వణికిపోతున్నాడు. పండ్లమ్ముకుని బ్రతికే ఆకుటుంబంలో ఇక మిగిలినది అతడొక్కడే!

75సం.ల యాదమ్మ అనే వృద్ధురాలినిసైతం అమానుషంగా హింసించారా రాక్షసులు. ఆమె ముక్కును, పెదవులను తెగనరికారు. ఆమె కొడుకును కత్తితో పొడిచారు. కొడుకు ఏమయ్యాడో తెలియని స్థితిలో అవృద్ధురాలు తెగిన ముక్కు, పెదవులతో అలాగే ఏడుస్తూ రెండురోజులు ఉండిపోయింది. చివరికి రెండురోజుల తరువాత ఎవరో బస్తీ సందర్శనకు వచ్చిన నాయకులు ఆమెదుస్థితి చూసి ఆసుపత్రికి తరలించారు.

పార్థీవాడలో సగానికిపైగా గృహాలు బూడిదగా మారిపోయాయి. చనిపోగా, గాయపడి ఆసుపత్రుల పాలుకాగా మిగిలిన వారిలో చాలామంది ప్రాణభయంతో

పాతబస్తీ విడిచిపెట్టి వచ్చేశారు. మిగిలిన కొద్దిమంది స్త్రీ పురుషులు ప్రాణాలరచేతు లలో పెట్టుకొని బిక్కుబిక్కు మంటూ బ్రతుకుతున్నారు. చీకటిపడగానే అందరూ ఒకే ఇంటిడాబాపైకి చేరి, రాళ్ళు, కట్టెలతో జాగరణ చేస్తున్నారు. కంటి మీద కనుకుతీసి ఎన్ని రోజులయిందో వారికి! శనివారం నాటి భయంకర దృశ్యాలు కళ్ళముందు మెదలు తూంటే నిద్రఎలావస్తుందని ప్రశ్నించాడు ఒక యువకుడు.

మసీదులలో నుండి రాత్రిపూట 'అల్లాహోఅక్బర్' అంటూ పెద్దగా కేకలు వినిపిస్తున్నాయని, అవి వింటేనే భయం కలుగుతోందని వారు చెప్పారు. 'మసీదుల లోని మైకులలో ఆవో.. ఆవో అని అరుస్తున్నారని. మూడు ఈలలు వేస్తున్నారు. మొదటిఈలకు తురకలు ఇళ్ళనుండి మసీదులకు చేరడం - రెండవీలరాగానే మసీదులలో సిద్ధంగా ఉన్న తల్వార్ లు, ఇతర మారణాయుధాలు పట్టుకోవడం - మూడవ ఈలరాగానే హిందువులపై మూకుమ్మడిగా దాడి చేయడం జరుగుతోంది. ఈ భయంకర వాతావరణంలో మేమెలాబ్రతకాలి బిడ్డా!' అంటూ గొల్లుమంది లక్ష్మీనరసమ్మ.

వారిపై దాడి చేసిన వారంతా బైటవారేమీ కాదని, చుట్టుప్రక్కల నివసించే ముస్లింలేనని, ఒకవేళకొద్దిమంది బైటవారున్నా వారికి ఏది హిందువు ఇల్లో, ఏది ముస్లిం ఇల్లో చూపించినది కనీసం స్థానిక ముస్లింలేనని అన్నాడు పూరన్‌సింగ్. పండ్లు అమ్ముకునే పూరన్‌సింగ్ ఆబస్తీలో పెద్దమనిషి. కాంగ్రెనాయకుడు. తమపై దాడి చేసిన వారిపేర్లు కూడా తాను చెప్పగలనని అతడన్నాడు. అనేకపేర్లు చెప్పాడు కూడా. ముఖ్యంగా జాఫర్ అనే షక్కర్‌గంజ్‌కి చెందిన గూండా తన అనుచరులతో ఈ మారణకాండ సాగించాడని బస్తీవాసుల కథనం. 'హబీబ్! ఎందుకు ఇలా చేస్తున్నార్రా?' అని తాను అడుగుతూండగానే తనను పొడిచారని ఒకస్త్రీ ఏడుస్తూ చెప్పింది. తమబస్తీలో ఒక ఇంటిని తగులబెట్టకుండా కావాలని వదిలేశారని, దానికి కారణం దానిని అనుకుని ఒక ముస్లిం ఇల్లు ఉండడమేనని, ఈ ఇంటిని తగులబెడితే ఆ ఇంటికి కూడా నష్టం వాటిల్లుతుందేమోనని వదిలివేశారని, స్థానికులే ఈ దాడి చేశారనడానికి ఇంతకంటే ఏం సాక్ష్యం కావాలని వివరించాడు పూరన్‌సింగ్. దాడికి ఉపయోగించిన మారణాయుధాలు MRG 7171 ఫియట్ కారులో అగూండాలకు సప్లై అయ్యాయని అతడి ఆరోపణ.

15 మంది ప్రాణాలు బలిగొన్న (అందులో 6గురుపిల్లలు, 5గురు స్త్రీలు) షక్కర్‌గంజ్ పార్థీవాడ మారణకాండ గురించి డిసెంబర్ 11వతేదీన 'ది హిందూ పత్రిక ఇలావ్రాసింది:' పాతబస్తీలోని షక్కర్-గంజ్ ప్రాంతంలోగల పార్థీవాడి ప్రజలు శనివారం రాత్రి తమపై దాడి చేసిన 150 మంది దుండగులతో సుమారు 4

గంటలసేపు పోరాటం సాగించారు. ఒక మాజీ సైనికుని కథనం ప్రకారం (ప్రస్తుతం అతడొక ప్రైవేటు కంపెనీ వాచ్‌మన్‌గా పనిచేస్తున్నాడు) రాత్రి 7-30 గం.ల సమీపంలో ఒక గుంపు పెద్దగా అరుస్తూ బస్తీపై దాడిచేసింది. భయకంపితులైన బస్తీవాసులు తేరుకునే లోపున విద్యుచ్ఛక్తి వైర్లు తెంపి వేశారు. ఇండ్లలోని వారిని బైటకు ఈడ్చి, కత్తులతో పొడిచారు. ఒక స్త్రీని కత్తులతో పొడిచారని, ఆమెఇంకా ప్రాణాలతో ఉండడం చూసి కిరోసిన్ పోసి తగులబెట్టారని ఒక స్థానికుడు తెలిపాడు. ఒక సాయుధబలగాన్ని పంపి, తమ ప్రాణాలు కాపాడవలసిందని పోలీసులకు ఎన్నిసార్లు ఫోను చేసినా ప్రయోజనం లేకపోయిందని ఆ మాజీసైనికుడు తెలిపాడు. స్థానిక శాంతిసంఘం నాయకుని కలిసి తమ గోడు వినిపిస్తూండుగా, ఆ నాయకుని ప్రక్కనున్న వ్యక్తి కత్తితో తమలో ఒకరిని పొడిచాడని కూడా అతడు తెలిపాడు. తన కళ్ళముందే తన తల్లిని ముక్కలు ముక్కలుగా నరికారని ఒక 18సం.ల యువతి రోదిస్తూ చెప్పింది. తన తండ్రి, అత్త దుండగుల చేతులలో బలి అయ్యారని ఒకబాలుడు ఏడుస్తూ చెప్పాడు. పోలీసులు వచ్చే సమయానికి అంతా అయిపోయిందని వారు చెప్పారు. దాడి చేసిన వారి పేర్లను చెప్పినా పోలీసులు ఎలాంటి చర్యా తీసుకోలేదని వారు ఆరోపించారు.”

ఈ వివరాలు చాలు... ఆరోజు ఏం జరిగిందో మనం ఊహించుకోవడానికి....

**తీగెలకుంటలో దారుణాలు:-** అదేరోజు... అంటే శనివారం రాత్రి.... దాదాపుగా షక్కర్‌గంజ్ పార్ధీవాడపై దాడి జరిగిన సమయంలోనే జహానుమాప్రాంతంలో గుట్టలను అనుకుని ఉండే తీగలకుంట అనే మునిసిపల్ కార్పొరేషన్ వారి వెనుకబడిన వర్గాల గృహసముదాయంలో నివసించే హరిజనులపై ముస్లింలు పాశవికంగా దాడి చేశారు.

హనుమంతు అనే కార్పొరేషన్ ఉద్యోగిఇంటిపై దాడి చేసి అతడిని, అతడిభార్యను, వారి పిల్లలు ముగ్గురుని చంపివేశారు. ఇంటినెంబర్ 208లో ఇద్దరు హరిజనులను, ఇంటినెంబరు 190లో భార్యాభర్తలు, ఇద్దరు పిల్లలను వారు ఊచకోతకోశారు. వీరంతా హరిజనులే.

తీగలకుంటలో జరిగిన దాడిలో అన్నింటికంటే హృదయ విదారకమైనది ఇంటినెంబర్ 12 లో జరిగిన హత్యాకాండ. ఆ ఇంట్లో శంకర్, గర్భవతి అయిన అతని భార్య చంద్రమ్మ, కుమార్తెలు యాదమ్మ (15 సం.లు), రేణుక(7సం.), స్వప్న(5సం.), వరలక్ష్మి(2సం.లు) నివసిస్తూ ఉంటారు. మానవత్వం మరచిన రాక్షసమూకలు ఆఇంటిపై దాడి చేశాయి. తలుపులు బ్రద్దలుకొట్టి లోపల ప్రవేశించగానే ఎదురుగా

స్వప్న కనిపించింది. ఒక్క కత్తివేటుకు ఆ పసిపాప లేత తల ఎగిరి అవతలపడింది. యాదమ్మ, రేణుక, వరలక్ష్మిలపైకి మళ్ళాయి ఆ కిరాతకుల చూపులు. క్షణాలలో యాదమ్మ, రేణుకలు వారి కత్తులకు బలైపోయారు. చంద్రమ్మ అడ్డుపడి భోరుభోరున విలపిస్తూ నన్ను చంపండి. నా బిడ్డలను విడిచిపెట్టండి' అని ప్రాధేయ పడసాగింది. అయినా ఆ మదాంధులకు కనికరం కలుగలేదు. 2సం.ల అన్నెంపున్నెం ఎరుగని వరలక్ష్మిపై కూడా పడింది తల్వార్ దెబ్బ. ఆదెబ్బకు వరలక్ష్మి లేతముఖం నిలువునా తెగిపోయింది. అక్కడితో వారి రక్తదాహం తీరలేదు. నిండు గర్భవతి అయిన చంద్రమ్మను వెల్లకిలా పడుకోబెట్టి ఆమె గర్భాన్ని నిలువునా చీరేశారు. ఆమె గర్భంలో నుండి చిందిన రక్తం ఇంటిపైకప్పు వరకు ఎగసింది. ఆ మాతృమూర్తి చేసిన ఆఖరి ఆక్రందన ఆ మానవమృగాల వికటాట్టహాసాలలో మునిగి పోయింది. శంకర్ కూడా వారి దాడిలో మరణించాడు. కాగా భగవద్విలాసం ఏమో కానీ 2 సం.ల పసిపాప వరలక్ష్మి మాత్రం వారి తల్వార్ దెబ్బకు ప్రాణాలు పోకుండా బైటపడగలిగింది. రేపు ఆ పసిపాప నాతల్లితండ్రులను అలా ఎందుకు చంపారని చుట్టుప్రక్కల వారిని ప్రశ్నిస్తే వారేమని సమాధానం చెబుతారు?

తీగలకుంట కూడా నిలువునా దగ్ధమైపోయింది. అందులో నివసించే అనేక హరిజన కుటుంబాలు దిక్కులేని పరిస్థితిలో మురళీధరబాగ్ శరణార్థిశిబిరంలో తలదాచుకుంటున్నారు. ఇంకోచోట ఇంకోచోట అయితే ఏ చిన్న గొడవజరిగినా దానిని మసిపూసి మారేడుకాయ చేసి, అగ్రవర్ణాలు దళితులను కాల్చిచంపు తున్నారనో, హింసిస్తున్నారనో గగ్గోలుపెట్టే కత్తి పద్మారావులు, కన్నాభిరాన్‌లు పాతబస్తీలో హరిజన గిరిజన సోదరులపై సాగుతున్న దారుణమారణ కాండపై నోరు మెదపరెందుకని! తమను మేయర్ చేయగానే మజ్లిస్ వారిని మించిన ప్రాణమిత్రులు లేరని పొంగిపోయిన సత్యనారాయణలు, ప్రకాశరావులు, ఆలం పల్లి పోచయ్యలు ఉలకరు పలకరెందుకని?

చివరికి ఆరెస్సెస్, విశ్వహిందూ పరిషత్ లాంటి సంస్థలే ఈ బాధితులకు అన్నంపెడుతున్నాయి. ఆశ్రయం ఇస్తున్నాయి. నగరంలోని వందలాది మంది హిందూసోదరులు అందుకు ఆర్థిక సహాయం చేస్తున్నారు. ఇదంతా సహృదయతతో... కర్తవ్యభావనతో....

ఇల్లుకాలి ఒకడేడుస్తూంటే బీడివెలిగించుకునేందుకు నిప్పడిగాడట ఇంకొకడు. ఆరకంగా తీగెలకుంటలో నష్టపోయిన కుటుంబాలను పరామర్శించడానికి, జరిగిన నష్టాన్ని అంచనా వేయడానికి బిజెపి ప్రతినిధిబృందం వెళ్తే, వారిని స్థానిక ముస్లింలు

ఘెరావ్ చేశారు. పార్టీ ఢిల్లీశాఖ అధ్యక్షుడు, పార్లమెంటు సభ్యుడు అయిన శ్రీ మదన్‌లాల్ ఖురానా, మరి ఇద్దరు పార్లమెంటు సభ్యులు శ్రీ కల్కాదాస్, శ్రీ ధరమ్‌పాల్‌సింగ్ గుప్తా, పార్టీ దళితమోర్చా అధ్యక్షులు శ్రీ బంగారు లక్ష్మణ్‌ల ప్రతినిధి బృందం ఆ బస్తీని సందర్శించడానికి వెళ్తే, స్థానిక ముస్లింలు తమకు జరిగిన నష్టాన్ని కూడా సందర్శించి వెళ్ళాలని పట్టుబట్టారు.

తీరా ఒక ముస్లిం తన ఇంటికి జరిగిన నష్టాన్ని గురించి 10 ని||ల సేపు వివరిస్తే తేలిందేమంటే అతడి ఇంటి తలుపు గడియొకటి విరిగిపోయింది. అదికూడా ఎలా! హిందువులు వారిమీద దాడిచేసినందువల్లకాదు. పోలీసులు శనివారం జరిగిన హత్యాకాండలో హంతకులను పట్టుకోవడానికి వచ్చారు. ఏ ముస్లిం సోదరుడూ తలుపు తెరువలేదు. అప్పుడు బలవంతంగా వారు కొన్ని ఇళ్ళలో ప్రవేశించి, దుండగులను అరెస్ట్ చేశారు. ఆ గందరగోళంలో ఒక గడియ దెబ్బతింది. అదండీ! ఆయనకు కలిగిన పెద్దనష్టం!

ఒకప్రక్క హిందువుల ఇళ్ళను తగులబెట్టి, వారిని హత్యచేసి మరొకప్రక్క తమకు నల్లా నీరు సరిగారావడంలేదని, రెండురోజులుగా తమకు కరెంటులేదని వీరు బిజెపి ప్రతినిధి బృందాన్ని ఘెరావ్ చేస్తూంటే వీరిని ఏమనాలి?

## కొనసాగిన మారణకాండ

ఒకప్రక్క ముఖ్యమంత్రి చెన్నారెడ్డిగారు పరిస్థితి అదుపులో ఉందని ప్రకటిస్తూ ఉంటే మరొకప్రక్క పాతబస్తీలో ఆదివారం కూడా మారణహోమం కొనసాగుతూనే ఉంది. ఆదివారం ఉదయం 11 గం.లకు కూర్మగూడా హరిజనబస్తీ పైన దాడిజరిగింది. పట్టపగలే దాడిజరుగుతున్నా పోలీసులు పట్టించుకోలేదు. ఆబస్తీలో ముస్లింలు కూడా నివసిస్తూ ఉంటారు. వారు ముందే తమ ఇండ్లలోని స్త్రీలను వేరే స్థలాలకు పంపించి వేశారు. ఇక ఆ తరువాత పెద్దఎత్తున లూటీలు, గృహదహనాలు మొదలయ్యాయి.

కూర్మగూడాలో ఒక్క పోలీసు జాడకూడా లేదని కమలమ్మ, మణెమ్మ వాపోయారు. 'దేవుడికోసం ఎదురుచూస్తున్నట్లుగా, మార్గక్షణకోసం ఎవరు వస్తారా! అని ఎదురుచూస్తున్నాం' అంటూ కంటతడిపెట్టారు ఆఇల్లాళ్ళు. 'ఒకప్రక్క ప్రభుత్వం కనిపిస్తే కాల్చివేతకు ఉత్తర్వులిచ్చిందని చెబుతున్నా ముస్లిం దుండగులు తల్వార్లు పట్టుకుని నిర్భయంగా తిరుగు తున్నారని, మసీదులనుండి 'అవో...అవో....' అని అరుస్తున్నారని శ్రీమతి శోభ తెలిపారు.

హైదరాబాద్‌ను అగ్నిగుండంతో మార్చడంతో సంతృప్తి చెందని రక్తపిపాసులు రంగారెడ్డిజిల్లాను కూడా అగ్నికి ఆహుతిచేశారు. జిల్లాలో ప్రధానపట్టణమైన తాండూరులో పెద్దఎత్తున దహనకాండను సాగించారు. 10వ తేదీన బి.జె.పి ప్రజాస్వామ్య పద్ధతులలో బంద్‌కు పిలుపునిస్తే, దానికి ప్రతిగా తాండూరులో ముస్లిం దుండగులు దహనకాండకు, లూటీలకు పాల్పడ్డారు. దాదాపు 100 దుకాణాలను లూటీ చేయడమో, తగుల బెట్టడమో జరిగింది. ఇవన్నీ హిందువుల దుకాణాలేనని ప్రత్యేకంగా చెప్ప వలసిన అవసరం లేదు. అనేక హిందూగృహాలు కూడా కాలి బూడిదై పోయాయి. జిల్లా రామకరసేవా సమితి కార్యదర్శి, అయిన శ్రీ మనోహరరావు (న్యాయవాది) ఇంటిలోనివన్నిదొంగిలించి ఇంటిని ధ్వంసంచేసి ఆయనను చంపప్రయత్నించారు.

నిన్నటివరకు ఆనందంగా జీవించిన వారి కుటుంబం నేడు ఈ మతాంధుల దౌష్ట్యం కారణంగా కట్టుబట్టలతో వీధినపడింది. తాండూరులో ఉన్న రెండు పెట్రోలు బంకులు పూర్తిగా దగ్ధం చేశారు. కూరగాయల మార్కెట్టును కూడా తగులబెట్టే వారే. అయితే హమాలీలు సంఘటితంగా ప్రతిఘటించడంతో ఆ ప్రయత్నం సఫలం కాలేదు. కసితీర్చుకునేందుకు ఒక వృద్ధహమాలీని రోడ్డుపై పడుకోబెట్టి, అతడి పై నుండి లారీనడిపించి హత్య చేశారు. సుమారుగా కోటిన్నర రూపాయల ఆస్తినష్టం జరిగింది. అయిదుగురు మరణించారు.

రంగారెడ్డి జిల్లాలోని అనేక గ్రామాలలోను, సికింద్రాబాద్ ప్రాంతంలోను కూడా పెద్ద ఎత్తున మతకలహాలు వ్యాపించాయి. సుమారుగా 10 రోజుల పాటు నగరంలో అరాచకం రాజ్యం చేసింది.

## పోలీసులపై నమ్మకం పోయిన ప్రజలు

మొన్నటి మతకలహాల సందర్భంగా పోలీసులు వ్యవహరించిన తీరుకు సర్వత్రా, నిరసన వ్యక్తం అవుతోంది. పోలీసులు ఏ ఒక్కచోటనయినా కఠినంగా వ్యవహరించి ఉంటే అల్లర్లు చాలావరకు నియంత్రించగలిగి ఉండే వారని చాలామంది అభిప్రాయపడ్డారు. ప్రజలకు రక్షణ కల్పించ వలసిన పోలీసులు అనేక సందర్భాలలో చాలా నిర్లక్ష్యంగా వ్యవహరించారని, కొన్ని సమయాలలో అయితే వారు కూడా దుండగులతో చేతులు కలిపారని ఆరోపణలు వినవస్తున్నాయి. ఏ బాధితుడిని అడిగినా పోలీసులపైన నిందలే వినిపిస్తున్నాయి. కేవలం పాతబస్తీలోనే కాదు.... కొత్తబస్తీలో కూడా ప్రజలు పోలీసులను తీవ్రంగా నిరసిస్తున్నారు. అనేకబస్తీలలో

స్థానికులే రక్షణదళాలుగా ఏర్పడి, రాత్రుళ్ళు గస్తీ తిరుగుతున్నారు. అయితే పోలీసులు వీరిని కూడా వేధిస్తూండడంతో ప్రజలకు మరింత ఏహ్యాభావం పెరుగుతోంది.

**ఎందుకీ వైఫల్యం:** పోలీసు యంత్రాంగం ఘోరవైఫల్యానికి కారణాలు కేవలం పోలీసులకు పరిమిత మైనవికావు. అన్నింటికంటే అతిపెద్ద కారణం రాజకీయనాయకుల ప్రమేయం. పోలీసు అధికారుల నియామకం దగ్గర నుండి దుండగులను విడిపించే వరకు అన్నీ రాజకీయనాయకులు చెప్పినట్లు జరుగుతాయి. ఈ ధోరణికారణంగా పోలీసువ్యవస్థ స్వతంత్రంగా వ్యవహరించే స్థితిపోయింది. వారిలో ఆత్మస్థైర్యం క్షీణించింది.

గతంలో శ్రీ గురునాధరావు నగర పోలీసుకమీషనర్‌గా ఉండేవారు. ఆయన హయంలో నగరంలో శాంతిభద్రతల పరిస్థితి చాలా మెరుగుగా ఉండిందని అనలేం కానీ అక్టోబర్ 30 కరసేవకు ముందు నగరంలో శాంతి భద్రతలను కాపాడడానికి ఆయన చేసిన విజయవంతమైన కృషిని ప్రశంసించ కుండా ఉండలేం. ఎందుకంటే తగినంత ముందుగా కర్ఫ్యూ విధించడం, సంఘ విద్రోహశక్తులను అరెస్ట్ చేయడం లాంటి చర్యల ద్వారా ఆయన ఆసమయంలో మతకలహాలు రెచ్చగొట్టాలన్న కుట్రను భగ్నం చేయగలిగారు.

నిజానికిమజ్లిస్ పార్టీ పథకం ప్రకారం కరసేవమొదటి దశకుముందే దేశంలోని వివిధ ప్రాంతాలలో చెలరేగినట్లే హైదరాబాద్‌లో కూడా మత కల్లోలాలు చెలరేగవలసింది. ఒవైసీ తది తరులు అందుకు అవసరమైన అన్ని ఏర్పాట్లు చేశారు కూడా. తల్వార్‌లు తదితర మారణాయుధాలు మసీదుల వద్దకు చేర్చబడ్డాయి. ముస్లిం గూండాలు, సంఘవ్యతిరేక శక్తులకు అవసరమైన సూచనలు, పథకాలు అందించబడ్డాయి. అయితే చివరికి గురునాధరావు కఠిన చర్యలు తీసుకోవడంతో వారి ఆటలు సాగలేదు.

ఉత్తర భారతదేశమంతటా తమ సహచరులు మతమారణ కాండను సృష్టించగా, తాను తన నియోజకవర్గంలో అపనిచేయలేక పోయినందుకు ఒవైసీ దిగులుచెందాడు. ఇలా అయితే బాబరీయాక్షన్ కమిటీలో తన ప్రతిష్ఠమంటగలిసిపోతుందని భావించాడు. ఎంతమంది హిందువులను ఎక్కువ చంపగలిగితే అంత ప్రతిష్ఠలభిస్తుంది కదా! కనుక అందుకు అడ్డుగా ఉన్న కమీషనర్ గురునాధరావును తొలగించడానికి ప్రయత్నాలు ప్రారంభం అయ్యాయి.

ఒవైసీకి, చెన్నారెడ్డికి మధ్య కాంగ్రెస్ రాజ్యసభ సభ్యుడు ఎమ్.ఎమ్.హాషీం దళారీగా వ్యవహరించాడు. చెన్నారెడ్డికి, హాషీంకు గల 'పూర్వసంబంధాలు' జగ

ద్విదితాలు. అందుకే హాషీంని వాడుకుని గురునాధరావును తప్పించడంలో ఒవైసీ కృతకృత్యుడయ్యాడు. ఈ చర్య పోలీసుల మనస్థైర్యాన్ని, నిజాయితీగా పనిచేయగ లధైర్యాన్ని దెబ్బతీసింది.

ఇక ఒకరిద్దరినీ పట్టుకుని అరెస్ట్‌చేసినా ఏ ఎమ్మెల్యేనో, మరే రాజకీయనాయ కుడో వచ్చి విడిపించుకు పోయేవారు. పాతబస్తీలో అయితే మరీ వీధి నాయకులు, కార్పొరేటర్లు కూడా పోలీసులపై దౌర్జన్యం చేయసాగారు. సబ్ ఇన్‌స్పెక్టర్ల కాలర్లు పట్టుకుని మజ్లిస్ కార్పొరేటర్లు దుండగులను విడిపించుకు పోయిన సంఘటనలు కూడా ఉన్నాయని ప్రజలు చెబుతున్నారు. సరూర్‌నగర్ పోలీసులు 4గురు దుండ గులను అరెస్ట్‌చేస్తే యువరాజు సుధీర్‌కుమార్ ఫోను, మరొకచోట ఇద్దర్ని అరెస్ట్ చేస్తే హనుమంతరావు ఫోను...

'సిటీలో ఉన్న ఎమ్మెల్యేలు, రాజకీయనాయకులందరినీ అరెస్ట్ చేసి జైల్లో పారేస్తే ఈ గొడవలు వాటంతటవే ఆగిపోతాయి' అంటూ ఆవేశంగా వ్యాఖ్యా నించాడు ఉస్మానియా ఆసుపత్రి దగ్గర ఒక యువపోలీసాఫీసర్.

వీటికి తోడు పాతబస్తీలో పోలీసులకు తమసొంత ప్రాణాలకే రక్షణ లేదన్న భయం కూడా ఉంది. అందుకే అనేకచోట్ల తమకళ్ళ ముందే దాడులు జరుగుతున్నా పోలీసులు నిస్సహాయంగా నిలబడిపోయారు. షక్కర్‌గంజ్‌లో సర్కిల్ ఎదురుగానే ఇద్దరిని సజీవదహనం చేశారు. తీగలకుంటలో కూడా అదే జరిగింది. అనేక సందర్భాలలో బాధితులు దాడులు జరుగుతున్న విషయాన్ని పోలీసులకు ఫోన్ చేసి చెప్పినా వారు దుండగులు పారిపోయే వరకు వచ్చేవారే కాదు.

ఇది చాలదన్నట్లు అమాయకుల వేధింపు కూడా వారిపై ప్రజలకు అసహ్యం కలిగించడానికి మరొక కారణం అయింది. తలాబ్‌కట్ట, పంచలింగాల, అలియాబాద్ వంటి బస్తీలలో ఒక ప్రక్క సర్వస్వం కోల్పోయి ప్రజలు ఏడుస్తూ ఉంటే, మరొకప్రక్క పోలీసులు వచ్చి ఇండ్లలోని మగవారిని అకారణంగా తీసుకునిపోయి దొంగకేసులు బనాయించడంలాంటివి సాగించారు.

ఈ చర్యలన్నింటి వల్ల ప్రజలలో పోలీసుయంత్రాంగం ప్రతిష్ఠ పూర్తిగా దిగ జారిపోయింది. ఈదిగజారిన ప్రతిష్ఠను మరింత హీనస్థితికి చేర్చిన మరిఇద్దరు ఘనులగురించి ఇక్కడ కొద్దిగా మాట్లాడుకోవడం సబబుగా ఉంటుంది.

భాగ్యనగర్‌లోని పోలీసులలో ముస్లింల సఖ్యకూడా తక్కువేమీకాదు. పాతబస్తీలో అయితే 65 శాతం పోలీసులు ముస్లింలే. ముఖ్యంగా క్రిందిస్థాయి పోలీసుయంత్రాం గంలో వీరిసంఖ్య చాలాఎక్కువ. వీరంతా అభినవ, రజాకర్లతో చేతులు కలిపి, ఈ

మతకలహాలను మరింత ప్రజ్వరిల్లి జేశారు. అనేక చోట్ల బాధితులు దుండగులను పట్టించిఇచ్చినా ఈపోలీసులు విడిచిపెట్టేశారు. పార్థీవాడలో ప్రజలు ఒక దుండగుడిని పట్టి పోలీసుకి అప్పగించారు. అతడు వెంటనే అక్కడే ఒక లెంపకాయకొట్టి 'చల్ జావ్' అంటూ విడిచిపెట్టేశారు. ఇళ్ళుతగులబెట్టి, అమాయకులను కిరాతకంగా చంపిన వారికి కేవలం ఒక చెంపదెబ్బ శిక్షన్నమాట.

పై అధికారులలో అనేకులు నిజాయితీపరులు ఉన్నారు. అయితే ప్రభుత్వం, రాజకీయనాయకులు నిర్లజ్జగా ముస్లిందుండగులను సమర్థిస్తూంటే వారు నిస్సహాయంగా మిగిలిపోయారు. కాగా ప్రభుత్వం యొక్క ఈ పక్షపాతధోరణిని అడ్డం పెట్టుకుని విజృంభించిన పోలీసు అధికారులు లేకపోలేదు. వారిలో మొగల్‌పురా సర్కిల్ ఇన్‌స్పెక్టర్ హాఫీజ్ ఖాన్ ప్రముఖుడు.

మొగల్‌పురాసర్కిల్‌లోని ఏ పోలీస్ స్టేషన్‌పరిధిలో హిందువులపై జరిగిన దాడిలోనైనా ఏ బాధితుడినైనా కదిపితే మొట్టమొదటి తిట్టు హాఫీజ్‌ఖాన్ పైనే వస్తుంది. పరమహిందుద్వేషిగా, ముస్లిం మత మౌఢ్యుడిగా అతడు ముద్రపడ్డాడు. పై అధికారులకు కూడా ఈ విషయం తెలుసు. అయితే అతడికి గల రాజకీయమద్దతు కారణంగా వారేమీ చేయలేని స్థితిలో ఉండిపోయారు.

హాఫీజ్‌ఖాన్ జీపులో తరచు దర్శనమిచ్చేది పోలీసులుకాదు. స్వయంగా మజ్లిస్ పార్టీ కార్పొరేటర్లు. వారి అనుచరగుండాలూను. వారి వెంట హిందూ బస్తీలకు వచ్చి, వారు చూపించిన హిందువునల్లా అరెస్ట్‌చేసి, కేసుల్లో ఇరికించడం అతడి కార్యక్రమం. ఇకముస్లింల దాడి ఎక్కడ, ఎప్పుడు జరుగుతుందో ముందుగా హాఫీజ్‌ఖాన్‌కు కబురుపెట్టబడుతుంది. దానికి ఏ ఆటంకం కలుగకుండా జరిగేటట్లు చూడడానికి ఆయన అన్ని జాగ్రత్తలు తీసుకుంటాడన్నమాట.

సుల్తాన్‌షాహి బస్తీలో ముస్లింలు దాడిచేసిన గల్లీకి ఎదురుగా ఒక మసీదు ఉంది. ఆమసీదునుండే హిందువుల ఇండ్లపైన దాడిజరిగింది. అయితే మసీదుకు, బస్తీకి మధ్యలో ఒక సి.ఆర్.పి. పికెట్ ఉండేది. ఆదివారం దాడి జరుగడానికి కొద్దిముందు సర్కిల్ ఇన్‌స్పెక్టర్ హాఫీజ్‌ఖాన్ జీపులో వచ్చి, అక్కడ ఉండే సి.ఆర్.పి. జవాన్లను వేరొకచోట గస్తీ అవసరముందని చెప్పితీసుకుని వెళ్ళిపోయాడు. కొద్దిసేపటిలోనే ముస్లింలు ఆబస్తీపై విరుచుకు పడ్డారు. అల్లరి విని సి.ఆర్.పి.జవాన్లు అదేమిటని అడిగితే, బస్తీ ప్రజలు తాగి తమలోతాము కొట్లాడుకుంటున్నారని చెప్పి, వారు అక్కడికి వెళ్ళకుండా నిరోధించాడు. చివరికి గొడవ మరీ ఎక్కువకావడంతో జవాన్లు అటు పరిగెత్తారు. అయితే అప్పటికే జరుగవలసిన ఘోరాలన్నీ జరిగిపోయాయి.

స్వయంగా సుందర్‌లాల్ అనే సి.ఆర్.పి. కానిస్టేబుల్ ఈ విషయాన్ని వెల్లడించాడు.

శనివారం రాత్రి సుల్తాన్‌షాహీలో 200 మంది ముస్లింలు దాడిచేసి ½గం. సేపు మారణహోమం సృష్టిస్తున్నా హపేజ్‌ఖాన్ తమ రక్షణకు రాలేదని ఆబస్తీ వాసులు ఆరోపించారు. ఆదాడిలో తివారీ అనే ఉపాధ్యాయుడు, అతడి ఇద్దరు కుమారులు హత్యచేయబడ్డారు. వారికుటుంబంలో మరో 5గురు స్త్రీలు, పిల్లలు తీవ్రంగా గాయపడ్డారు. తమకు రక్షణ కల్పించకపోగా, తమ ఇండ్లపైనే దాడిచేసి 12,13 సం.ల వయస్సు కుర్రవాళ్ళను కూడా తీసుకునిపోయి నిర్బంధిస్తున్నాడని, ఇంట్లో చిన్న కర్రముక్క ఉన్నా తీసుకుని పోతున్నాడని, ఆవిధంగా ముస్లింలు దాడిచేస్తే ఎదుర్కొనడానికి తమవద్ద మనుషులు గానీ, ఆయుధాలు కానీ లేకుండా చేయాలన్నదే అతడిదురుద్దేశమని ప్రజలు ఆరోపించారు. ఆ సర్కిల్‌ను వెంటనే సస్పెండ్‌చేయాలని వారు కోరారు. ఈవిషయమే ఒక ఎసిపితో అన్నప్పుడు 'నిజమే! అతడిసంగతి మాకు కూడా తెలుసు. కానీ ఏంచేస్తాం? మీకు చేతనైతే ఎవరైనా బలమైన రాజకీయనాయకుడిద్వారా చెప్పించి అతడిని బదిలీ చేయించుకోండి' అని సమాధానం ఇచ్చాడు.

ఇదండీ హాఫీజ్‌ఖాన్ కథ.

అయితే హాఫీజ్‌ఖాన్‌ను మించిన ఘనుడు మరొకాయన ఉన్నాడు. ఆయన పేరు ఖాదిర్. ఆ మహానుభావుడు ఒక రిజర్వ్ కానిస్టేబుల్. హాఫీజ్‌ఖాన్‌లో ఎంతమతతత్వం, మతద్వేషం ఉన్నాయో, అని అంతకంటే రెండాకులు ఎక్కువే ఖాదిర్‌లో కూడా ఉన్నాయి. అయితే హాఫీజ్‌ఖాన్‌లో అవి హుందాతనం ముసుగులో దాగిఉండగా, ఖాదిర్‌మాత్రం బహిరంగంగానే వాటిని ప్రదర్శించేవాడు. ఆమతతత్వమే చివరికి ఎసిపి అంతటి ఉన్నతాధికారిని స్వయంగా అతడి కింద పనిచేస్తూనే కాల్చిచంపేందుకు ఖాదిర్‌ను ప్రోత్సహించింది.

ఖాదిర్ మొదటినుండి చాలా వివాదాస్పదమైన మనిషిగానే ఉండేవాడు. అందుకే ఏ పోలీసు అధికారి కూడా అతడికి తనక్రింద ఉంచుకోనడానకి ఇష్టపడేవారు కాదు. తరచు అతడికి గార్డు డ్యూటీ మాత్రమే వేసి, స్టేషన్లో వదిలేస్తూండేవారు. అయితే అవకాశం చిక్కినప్పుడల్లా పోలీస్‌పార్టీ వెంబడి వెళ్ళి, తన ఉత్సుకతను తీర్చుకుంటూ ఉండేవాడతడు.

డ్యూటీలో ఉన్న సమయంలో పార్ధీవాడకు తరచు వచ్చేవాడని ఆబస్తీకి చెందిన ప్రకాష్ చెప్పాడు. (ప్రకాష్‌భార్య ఈ కలహాలలో హత్యచేయబడింది) ఒకసారి కొందరు ముస్లిం యువకులు తమబస్తీకి చెందిన ఒక యువతిని వేధించిన కేసులో విచా

రించేందుకు ఖాదిర్ తమబస్తీకి వచ్చాడంటూ ఆనాటి సంఘటనను ప్రకాష్ గుర్తు చేసుకున్నాడు.

పార్థీవాడకు వచ్చిన ఖాదిర్‌కు పార్థీలు కుర్చీవేసి మరీ గౌరవించి, తమకు జరిగిన అవమానాన్ని తెలుపుకున్నారు. అయితే ఆ తరువాత ఆముస్లిం యువకులను ప్రక్కకుపిలిచి ఖాదిర్ చెప్పిన మాటలేమిటో తెలుసా?

మీరేం ముస్లింలురా! పిల్లను ఎత్తుకుపోయి, రేప్ చేసి విడిచి పెట్టేయ్యాల. ఏమైనా అయితే నేను చూసుకుంటా. ఊరికే అల్లరిపెట్టి మన పరువు తీస్తారా,?' ... ఈమాటలు తాను స్వయంగా విన్నానంటాడు ప్రకాష్.

ఇది అతిశయోక్తి ఎంతమాత్రం కాదని తరువాతి సంఘటనలు ఋజువు చేశాయి. పార్థీవాడలో అల్లర్లు జరుగుతున్నాయని తెలిసి వెళ్ళిన డిసిపి వెంట ఖాదిర్ కూడా వెళ్ళాడు. అక్కడ దుండగుల పైకి గురి పెట్టవలసిన తుపాకీని హిందువులపైకే ఎక్కుపెట్టాడు, సకాలంలో డిసిపి జోక్యం చేసుకుని చివాట్లు పెట్టడంతో ఖాదిర్ ఉబలాటంకాస్తా నీరు గారిపోయింది. (డిసిపి ఖాదిర్‌ని చెంపమీద కొట్టాడని కూడా కొందరు చెప్పారు). అలియాబాద్‌లో ఇండ్లపై పోలీసులు దాడిచేసి, యువకులను పట్టుకుపోవడాన్ని వ్యతిరేకిస్తూ మహిళలు ఛత్రినాక పోలీస్‌స్టేషన్ ముందు ధర్నా చేస్తే, స్టేషన్ మేడమీదకి పోయి, ఎటువంటి కారణంగానీ, అనుమతి గానీ లేకుండా ఆస్త్రీలపై కాల్పులు సాగించిన మతాంధుడు ఈ ఖాదిర్.

అప్పటికే పోలీసు అధికారులు అతడిని క్షమించారు. చివరికి 11వతేదీ రాత్రి అలియాబాద్ శివారు పంచలింగాల వద్ద హిందువుల ఇండ్లపై దాడి చేసిన ముస్లిం గూండాలను నిర్బంధించడానికి ఏసిపి సత్తయ్య వెంబడి బయలుదేరినప్పుడు తన హిందూ రక్తదాహం తీర్చుకోవడానికి ఖాదిర్‌కు చక్కటి అవకాశం లభించింది.

సత్తయ్య నిజాయితీ గల అధికారి. పంచలింగాల వద్ద దాడికి కారణమైన ముస్లిం గూండాలను ఆయన 12వతేదీ అర్ధరాత్రి నిర్భయంగా దగ్గరుండి అరెస్ట్ చేశాడు. అరెస్టైయినవారిలో స్వయంగా ఖాదిర్ తమ్ముడు కూడా ఉన్నాడు. దాంతో ఖాదిర్‌లోని మతసర్పం విషం గ్రక్కుతూ బుసలు కొట్టసాగింది. మొదటిదఫా దుండగులను అరెస్ట్ చేసి ఛత్రినాక పోలీస్‌స్టేషన్‌కు చేర్చిన తదుపరి మరల మిగిలిన వారిని అరెస్ట్ చేసేందుకు రాత్రి 3 గం.లకు శ్రీ సత్తెయ్య జీపులో బయలు దేరాడు.

ఈ సారి తాడో పేడో తేల్చుకోవాలని నిర్ణయించుకున్నాడు ఖాదిర్. తన కళ్ళముందే తనవాళ్ళు సత్తెయ్య చేతికి చిక్కిపోవడం అతడు సహించలేకపోయాడు.

పంచలింగాలలో జీపు ఆగింది. సత్తెయ్య వైర్‌లెస్ సెట్‌ను తీసుకుని జీపులో నుండి దిగబోతున్నాడు. అంతలో సరిగ్గా సత్తెయ్య వెనుకనే కూర్చుని ఉన్న ఖాదిర్ ఆయన తల వెనుక తన రైఫిల్‌ను ఉంచి కాల్చాడు. ఆదెబ్బకు తలపగిలి ఎగిసి సత్తెయ్య అక్కడికక్కడే మరణించాడు. అలా తన రక్తదాహం తీర్చుకున్నాడు ఖాదిర్.

'ఖాదిర్ లాంటివాళ్ళు పోలీసు డిపార్ట్‌మెంట్‌లో ఉన్నందుకు చేం దుఃఖి స్తున్నాం' అని అధికారులు అంటూంటే చెన్నారెడ్డిగారు మాత్రం 'ఖాదిర్ పాపం అలసిపోయి సత్తెయ్యను కాల్చి చంపాడని' తేల్చి చెప్పేశారు.

ఇలాంటి నాయకుల మద్దతుతోనే పోలీసు యంత్రాంగంలో కూడా సంఘవిద్రోహులు పెచ్చరేగిపోతున్నారు. నిజాయితీ పరులైన అధికారులు నీరుగారిపోతున్నారు. సామాన్య ప్రజలు దినమొక గండంగా బ్రతుకవలసిన దుర్భర పరిస్థితులు ఏర్పడుతున్నాయి.

## కాసెట్ కార్ల ప్రహసనం - పోలీసుల అసమర్థతకు నిదర్శనం :

నగర ప్రజానీకాన్ని భయభ్రాంతులను చేయడానికి దుండగులు కొత్తరకం ఆడియో కేసెట్లు వినిపిస్తున్నారు. ఈ కేసెట్లలో పెద్దగా అరుపులు, కేకలు, పరిగెడు తున్న శబ్దాలు, బూట్లు చప్పుళ్ళు, అల్లా హో అక్బర్, జై బజరంగబలి నినాదాలు, స్త్రీలు, పిల్లలు ఏడుపులు రికార్డు చేయబడి ఉన్నాయి. ఉన్నట్లుండి ఏదో ఒక బస్తీలో అర్ధరాత్రి వేళ పెద్దశబ్దంతో ఈ క్యాసెట్‌లోని ధ్వనులు వినిపించడం ప్రారంభమౌతుంది. వినేవారి గుండెలవిసిపోయేలా ఉండే ఈ శబ్దాలు విని ప్రజలు ఏదో పెద్ద అలజడి జరుగుతోందని భయపడి వీధుల్లోకి వస్తారు. ఇంతలో కార్లు పరారవుతాయి. అయితే అప్పటికే వీధుల్లోకి చేరినజనం ఘర్షణలకు దిగడం, అలా బస్తీలలో మతకలహాలు ప్రారంభం కావడం జరుగుతోంది.

అనేకబస్తీలలో ప్రజలు ఈశబ్దాలు విని భయభ్రాంతులౌతున్నారు. ముఖ్యంగా మహిళలు, పిల్లలు, గుండెజబ్బుగలవారు చాలా భయపడుతున్నారు. పోలీసు శాఖ కూడా ఇలాంటి కేసెట్లు ఉపయోగింపబడుతున్న విషయాన్ని అంగీకరించింది. నగర పోలీస్ కమీషనర్ శ్రీ భాస్కర్‌రావు తాను స్వయంగా రెండుమూడు సార్లు రాత్రిగస్తీ తిరుగుతున్న సమయాలలో ఈ శబ్దాలు విన్నానని పేర్కొన్నారు. అయితే ఈకార్లను కానీ, ఈ కాసెట్లను కానీ పట్టుకోవడంలో పోలీసులు విఫలం అయ్యారు. పై పెచ్చు ప్రజలనే ఈ శబ్దాలు వినిబయటకురాకుండా, ఇళ్ళలోనే ఉండిపొమ్మని సలహాలిస్తున్నారు. బైటకు వచ్చినవారిపై లాఠీలు ఝళిపిస్తున్న సంఘటనలు కూడా

కద్దు. దుండగులను పట్టుకోవడం చేతకాని పోలీసులు ప్రజలను కొట్టడంపై ప్రజలు తీవ్ర అధిక్షేపణను ప్రకటిస్తున్నారు.

## ప్రజలను మోసగిస్తున్న శాంతిసంఘాలు - నాయకులు

శాంతిసంఘాలపేరిట పాతబస్తీలో వీధివీధికి ఏర్పడుతున్న సంఘాలు ముస్లిం గూండాలను పరిరక్షించడానికే సహకరిస్తున్నాయి తప్ప హిందువులకు అవి ఏవిధంగాను సహాయపడడం లేదు. కేవలం హిందువులు అధికంగా ఉన్న బస్తీలలో మాత్రమే వారినుండి తమను కాపాడుకోవడానికి ముస్లింలు శాంతిసంఘాల పట్ల ఆసక్తి ప్రదర్శిస్తున్నారు. హిందూనాయకుల దగ్గరకు స్వయంగా వెళ్ళి శాంతిసంఘం వేద్దామంటూ బ్రతిమాలుకుంటున్నారు.

రెండవప్రక్క తమ ఆధిక్యత ఉన్న బస్తీలలో మాత్రం యధేచ్ఛగా కుట్రలు సాగిస్తున్నారు. చాలా చోట్ల స్వయంగా శాంతిసంఘాల సభ్యులైన ముస్లింలే ముఖాలకు గుడ్డలు కట్టుకుని, లేదా రంగుపూసుకుని హిందువులపై దాడులు సాగించారు.

షక్కర్‌గంజ్ పార్థీవాడలో శనివారం రాత్రి మారణకాండ సాగుతుంటే స్థానిక శాంతి సంఘం నాయకుడైన ఒక మజ్లిస్ నేతదగ్గరికి అవాడ ప్రజలు పరిగెత్తుకుని వచ్చి, అల్లర్లు, ఆపించమని, తమ ప్రాణాలు కాపాడమని ప్రాధేయపడ్డారు. కాగా ఆ నాయకుడి ప్రక్కన నిలబడివున్న అతడి అనుచరుడు అక్కడే ఆ వాడ ప్రజలలో ఒకరిని కత్తితో పొడిచి పరారయ్యాడు. ఇదీ శాంతిసంఘాల నేతల పరిస్థితి!

అలియాబాద్ శివారు పంచలింగాలలో ఆదివారంనాడు శాంతిసంఘం నాయకులు ( వీరంతా సాధారణంగా ముస్లింలే ఉంటారు) మీటింగ్ పెట్టి 'మీరు ఇతర బస్తీలనుండి హిందువులను పిలవద్దు. మేం ముస్లింలను పిలవం. మనమంతా కలిసి ఉందాం' అని స్థానిక హిందూ హరిజనులను నమ్మబలికారు. పాపం! ఆ అమాయకులు నిజమేననుకుని నిశ్చింతగా కూర్చున్నారు. సరిగ్గా మంగళవారం రాత్రి చుట్టుప్రక్కల బస్తీల నుండి పెద్ద సంఖ్యలో ముస్లింలు ఆ బస్తీపై పడ్డారు. స్థానికముస్లింల సహకారంతో హిందువులందరినీ తరిమికొట్టారు.

ఇదీ శాంతి సంఘాల నిర్వాకం.

## ఎవరీ హంతకులు? - ఎందుకీ మారణ హోమం?

హైదరాబాద్, రంగారెడ్డి జిల్లాలలో తన వికృతరూపాన్ని ప్రదర్శించిన ఈ

హాస్యాస్పదం. ఈ 'ఘనకార్యం' చేయగల 'అభినవరజాకార్లు' ఒవైసీ వద్ద చాలామంది ఉన్నారు. అందుకోసం ప్రత్యేకంగా విజయవాడనుండి తెప్పించుకోవలసిన అవసరం ఏమాత్రం లేదు. కాకపోతే బీదర్, నాందేడ్‌లాంటి ప్రాంతాలనుండి, పాకిస్తాన్, బంగ్లాదేశ్‌ల నుండి వచ్చిన ముస్లింలు తాము స్థిరపడడానికి ఇంత జాగాదొరుకుతుందన్న ఆశతో ఈ మారణహోమంలో పాలుపంచుకుని ఉండవచ్చు. కువైటీ షేక్‌లు వారికి డబ్బులు ధారపోసి ఉండవచ్చు.

ఏది ఏమైనా వీటన్నింటికీ మూలంగా రెండేరెండు కారణాలు పేర్కొనాలి. మొదటిది జాతీయ స్థాయిలో ముస్లింల అస్తిత్వాన్ని చాటిచెప్పడానికి ఈ కల్లోలాలు జరిగాయి. కాగా రెండవది హైదరాబాద్‌లో పాతబస్తీని మినీపాకిస్తాన్‌గా మార్చాలనే ఒవైసీ చిరకాల వాంఛ తీర్చుకునే ప్రయత్నం ఇది.

**జాతీయ స్థాయిలోకుట్ర :** డిసెంబర్ 6వ తేదీన అయోధ్యలో రెండవదశ కరసేవ ప్రారంభం అయిన నాటినుండి దేశం మొత్తంలో మతకలహాలు రెచ్చకొట్టాలని ముస్లింలు కుట్ర పన్నారు. ఈ కుట్రలో బుఖారీ, ఒవైసీ, వి.పి.సింగ్‌లు భాగస్వాములు. ఈ మధ్య వి.పి.సింగ్‌ను నెత్తినెక్కించుకుని తిరుగుతున్న కమ్యూనిస్టులకు కూడా ఈ విషయం తెలుసు. అందుకే వారు దేశంలోని మతకలహాలన్నీ రామజన్మభూమి ఉద్యమపరిణామాలేనని వెనకాముందు చూసుకోకుడా ప్రకటించి పారేశారు కూడా.

కేంద్రంలో వి.పి.సింగ్ ప్రభుత్వం రామజన్మభూమి ఉద్యమం కారణంగానే పతనం కావడంతో తమ అశాసౌధాలు కుప్పకూలినట్లు బుఖారీ, ఒవైసీలు ఆందోళన చెందారు. తరువాత పదవి చేపట్టిన చంద్రశేఖర్ వీరెవరినీ కాక సయ్యద్ షహబుద్దీన్‌ను విశ్వాసంలోకి తీసుకోవడం వీరికి కడుపుమండించింది. షహబుద్దీన్ వీరికి పరమశత్రువు. కనుక ప్రభుత్వానికి ఒకసారి తమసత్తా ఏమిటో తెలపాలనుకున్నారు. దేశంలోని ముస్లింలంతా తమవెనుక ఉన్నారని, షాబుద్దీన్ వెనుకకాదని, కనుక రామజన్మభూమి విషయంలో ఏ నిర్ణయం చేయదలచినా అది తమను విశ్వాసంలోకి తీసుకుని మాత్రమే చేయాలని ఆరకంగా ప్రభుత్వానికి స్పష్టం చేయాలని వారి ఊహ.

అదీగాక కొద్దిరోజులుగా కాంగ్రెస్, జనతా(ఎస్)లు రామజన్మభూమి విషయంలో హిందువులకు అనుకూలంగా కొద్దిగా మొగ్గుచూపుతున్నాయి. దేశంలో వివిధ ప్రాంతాలలో విద్యావంతులైన, మితవాదులైన ముస్లింలు కూడా హిందూ విశ్వాసాలకు అనుకూలంగా ప్రతిస్పందిస్తున్నారు. ఇదే కొనసాగితే రాజకీయంగా కానీ,

అనుయాయులకు ప్రలోభాలు కల్పిస్తూ ఉంటాడు. పాతబస్తీలో తన ఆధిపత్యం పోకుండా ఉండేందుకు గాను అవసరమైనప్పుడల్లా మతకలహాలకు ముస్లింలను ప్రోత్సహిస్తూ ఉంటాడు.

అయితే ఒవైసీ ఒట్టి ఛాందసుడె కాదు. బహుతెలివైన రాజకీయ వేత్త కూడా. అందుకే పథకం ప్రకారం అనేక సంవత్సరాలుగా ప్రయత్నం చేసి హైదరాబాద్ కార్పొరేషన్‌లోని 40 వార్డులలో ముస్లిం ఆధిక్యతను నిర్మాణం చేయగలిగాడు. తద్వారా హైదరాబాద్ మునిసిపల్ కార్పొరేషన్‌ను చేజిక్కించుకొనగలిగాడు. హిందువులలోని హరిజనులను చేరదీసి మరిన్ని వార్డులను గెలుపొందాలని, ఇప్పటిలా కాంగ్రెస్ మీదనో, తెలుగుదేశం మీదనో ఆధారపడి కార్పొరేషన్‌లో తమనాయకత్వాన్ని నిలుపుకోవలసి రావటం కాక, తామే 50 పైగా స్థానాలు సంపాదించాలని అతడి ఆశ. అందుకు తగ్గ తయారీ కూడా అతడు చేసుకుంటూనే ఉన్నాడు.

మరోపక్క గతకొద్దికాలంగా పాకిస్తాన్, బంగ్లాదేశ్‌లనుండి వచ్చి, హైదరాబాద్‌లోనే బైఠాయించిన ముస్లింలు కొన్ని వేలమంది ఉన్నారు. వారందరికీ ఉండడానికి ఇంతస్థలం చూపించాలి. అందుకు చక్కటి మార్గం హిందువులను తరిమికొట్టడమే కదా.

అయితే అంగబలం, అర్థబలం, రాజకీయబలం కూడా తక్కువగా ఉన్న హరిజన, గిరిజనులను వారి బస్తీలనుండి తరిమికొట్టడం కొంత సులభం. రెండవది వీరుగనుక పాతబస్తీ విడిపోతే, ఇక మిగిలిన హిందువులకు రక్షణ అనేది కరువైపోతుంది. ఎందుకంటే ఇంతకాలం హిందువుల తరుపున గట్టి పోరాటపటిమను ప్రదర్శిస్తున్నది వీరే.

అలా ఒక దీర్ఘకాలిక పథకం ప్రకారం జరుగుతున్న కుట్రలో భాగమే మొన్నటి కల్లోలాలు. ఇవి యాదృచ్ఛికంగానో, మతావేశాలు వెచ్చు మీరడంవల్లో హటాత్తుగా సంభవించినవికావు. పథకంప్రకారం జరుగుతున్న కుట్రలో భాగాలే ఇవి.

అయితే ఈసారి ముస్లిం మతమౌఢ్యులు చెప్పుకోదగ్గ విజయాన్నే సాధించారని చెప్పాలి. హిందువులను పెద్దసంఖ్యలో వధించడంతోబాటు, వారి ఆత్మస్థైర్యాన్ని గట్టిగా వారు దెబ్బతీయగలిగారు. వేలాది హిందువులు పాతబస్తీ వదిలి ప్రాణ భయంతో పరిగెత్తి వస్తున్నారు. వారెవరూ, తిరిగి ఆ బస్తీలకు పోయేందుకు సిద్ధంగాలేరు.

'మేం ఇక ఆరాక్షసులతో కలిసి జీవించలేం' అనే నిష్కర్షకు వచ్చేశారు వారు. ఈ మతరాక్షసమూకలకు కావలసింది కూడా అదే!

అందుకే ఈ అమాయక ప్రజలు నిస్సహాయంగా చేతికందిన వస్తువులు తీసుకుని బస్తీలనుండి పారిపోయి వస్తూంటే దారిలో మేడలు, మిద్దెలు, అరుగులపైన నిలిచి ఉన్న పెండారీలు ఆనాందోత్సాహాలతో కేరింతలు కొట్టారు. పండుగ జరుపుకున్నారు. టపాసులు కాల్చారు.

'హమ్ ఇన్‌కో పాకిస్తాన్ బనాయేహై'

'మేం దీనిని పాకిస్తాన్‌గా మార్చి వేశాం' - అని సగర్వంగా ప్రకటించుకున్నారు.

# మత కల్లోలాల మూలకారకులు

హైదరాబాద్‌లో మతకలహాలు తరచు ఎందుకు సంభవిస్తూంటాయి? ఇదొక ప్రశ్న అయితే హైదరాబాద్‌లోనే మతకలహాలు ఎందుకు సంభవిస్తూంటాయన్నది మరొక ప్రశ్న. అమాటకొస్తే అసలు మతకలహాలు ముస్లింలు అధికసంఖ్యలో (అధికసంఖ్యాకులు కాదు) ఉన్న పట్టణాలలోనే జరుగుతూ ఉంటాయి. అధికసంఖ్య అంటే నూటికి 51 మంది ఉండనవసరంలేదు. 15% ఉంటే చాలు. అక్కడ ఇక మతపరమైన ప్రశాంతతకు కాలం చెల్లినట్లే.

పైప్రశ్నలకు సమాధానం కావాలంటే గతంలో జరిగిన మతకలహాల చరిత్రను కొద్దిగా పరిశీలించవలసిన ఉంటుంది. అల్లర్లు ఎందుకు ప్రారంభమౌతాయి? ఎవరు వాటిని ప్రారంభిస్తారు? వారికి కావలసిందేమిటి? వారిని నిరోధించచడం ఎలా? మొదలైన ప్రశ్నలకు ఆ పరిశీలన మాత్రమే సమాధానం చెప్పగలుగుతుంది.

1984 సెప్టెంబర్‌లో హైదరాబాద్‌లో ముస్లింల పంఖా ఉత్సవం, హిందువుల గణేశోత్సవాలు పెద్దెత్తున మతకలహాలకు దారితీశాయి. వాటిపై ఆ తరువాత రాష్ట్రప్రభుత్వం ఒక విచారణ సంఘాన్ని నియమించింది. ఆంధ్రప్రదేశ్ హైకోర్టు రిటైర్డ్ న్యాయమూర్తి జస్టిస్ ఎమ్. కృష్ణారావు నాయకత్వంలో అక్టోబర్11వ తేదీన నియమించబడిన ఈ ఏకసభ్య విచారణ సంఘం డిసెంబర్ 31 న తన నివేదికను సమర్పించింది. సంఘం ముందు సాక్ష్యం ఇచ్చేందుకు వచ్చిన సాక్షులను ప్రముఖ నక్సలైటు న్యాయవాది శ్రీ కన్నాభిరాన్ క్రాస్ ఎగ్జామన్ చేశారు.

విచారణ సంఘం సమర్పించిన నివేదికలోని కొన్ని అంశాలను క్రింద ఇస్తున్నాం. హైదరాబాద్‌లో మత కలహాలను ఎవరు, ఎందుకు, ఎలా రెచ్చగొడతారో ఈ నివేదికలో జస్టిస్ కృష్ణారావు స్పష్టంగా పేర్కొన్నారు.

హైదరాబాద్ కల్లోలాలకు గల చారిత్రక ఆధారాలను గురించి ప్రస్తావిస్తూ

సంఘం '1950 తరువాత ఇస్లామిక్ పేర్లు పెట్టుకున్న రాజకీయ పార్టీలు కొన్ని పట్టుకొచ్చాయని, నెమ్మదిగా ఇతర ప్రాంతాల ముస్లింలు వచ్చి హైదరాబాద్‌లో స్థిరపడడం ప్రారంభించారని, గల్ఫ్ ధనం పెద్దఎత్తున ప్రవహించసాగిందని, ఈ పరిణామాలు పాత బస్తీలో అల్పసంఖ్యాకులైన హిందువులతో ఘర్షణలకు దారితీశాయని పేర్కొంది.'

'కనీసం 1980 తరువాత జరిగిన ప్రతి కల్లోలానికి ముస్లింలు ఎటువంటి కవ్వింపు లేకుండానే హిందువులపై దాడిచేయడమే కారణమైంది.' అని సంఘం అభిప్రాయబడింది. మొహరం, రంజాన్ వంటి పండుగలప్పుడు సైతం హిందువులు ముస్లింలను రెచ్చగొట్టిన సందర్భం ఒక్కటి కూడా లేదని కూడా సంఘం స్పష్టంగా పేర్కొంది.

1984 సెప్టెంబర్ 3 వ తేదీ జరిగిన ముస్లింల పంఖా ఊరేగింపు సమయంలో గానీ, 9వ తేదీన జరిగిన గణేశ విగ్రహాలపైన ముస్లింలే దాడిచేరాని సంఘం స్పష్టంగా చేసింది. "ఈ రకమైన వేధింపులద్వారా ఉన్న కొద్ది మంది హిందువులను తరిమికొట్టి, వారి ఆస్తులను ఆక్రమించుకోవడానికి ముస్లింలు పథకం ప్రకారం ఈ దాడులు సాగిస్తున్నారు." అని కూడా సంఘం అభిప్రాయపడింది.

సెప్టెంబర్ 3వతేదీ పంఖా ఉత్సవం సందర్భంగా ఒక ముస్లిమ్ నాయకుడు ముస్లింలను హిందువులపై రెచ్చగొడుతూ తీవ్రమైన ప్రసంగం చేశాడని, అయినా పోలీసులు చూసీచూడనట్లు ఊరుకున్నారని సంఘం ఎత్తి చూపింది. పంఖా ఉత్సవానికి అసలు మతపరమైన ప్రాముఖ్యత ఎంతమాత్రం లేదని, కనుక దానిని సంపూర్ణంగా నిషేంధిచాలని కూడా సంఘం సిఫారసు చేసింది.

అధికారంలో ఉన్న ప్రతిరాజకీయ పార్టీ అల్పసంఖ్యాక మతస్తులను బుజ్జగించడానికే ప్రయత్నిస్తోందని, వారి ప్రయోజనాలపైన కాక, వారి ఒటు బాంకులపైననే దృష్టినిసారించి పనిచేస్తోందని సంఘ్ విమర్శించింది.

ముస్లింలు తమ ఛాందస ధోరణిని విడనాడి, ప్రధాన ప్రజాజీవన ప్రవంతిలో మిళితం అయ్యే విధంగాను, పర్దాపద్ధతిని విసర్జించి, కుటుంబ నియంత్రణను పాటించే విధంగాను చేయడానికి ప్రయత్నాలు జరగాలని కూడా సంఘం సూచించింది.

పైఅశాలతోబాటు పాతబస్తీలో మతకలహాల నివారణకు కూడా సంఘం అనేక సూచనలు చేసింది. అయితే యధాప్రకారం తదుపరి ప్రభుత్వాలు ఆ సూచనలను అమలు చేసే ధైర్యంలేక, ముస్లిం ఓటు బ్యాంకులపై వ్యామోహంతో సంఘం నివేదికను బుట్టదాఖలు చేశాయి.

సత్యాన్ని చెప్పేధైర్యం లేని ఈ నాయకులు పత్రికలు నిజానికి సమాజానికి పరోక్షంగా ద్రోహం చేస్తున్నట్లే. వీరే సత్యాన్ని చెప్పక పోతే ప్రజలకు ఇక అది తెలిసేదెలా? ప్రజలను అంధకారంలో ముంచెత్తడమేనా వీరిలక్ష్యం? అదేనా సెక్యులరిజమ్ అంటే? ఒకవేళ హిందువులే ఆక్రమణ చేసి ఉంటే ఈ నాయకులు, పత్రికలవు ఇంతే మౌనంగా ఉండేవా? ముస్లిం ప్రాణాలకు, హిందువుల ప్రాణాలకు మధ్య ఎంత విలువ తేడా ఉంది వీరి దృష్టిలో?

ఈ పరిస్థితులలో హిందూసమాజం ఇక వీరిపై ఆధారపడితే ప్రయోజనం శూన్యం. మతమౌఢ్య పరాకష్ఠను రాజకీయనేతల అసరమర్ధతను గుర్తించి స్వయంగా సమాజమే తగు పరిష్కార మార్గం ఎన్నుకోవలసి ఉంటుంది.

మతతత్వ దురాక్రమణ ధోరణికి తలవంచితే మరోసారి మాతృభూమి ముక్కలౌతుంది. విభజన సమస్యకు పరిష్కారం ఎంతమాత్రం కాబోదన్నది చరిత్ర, చెప్పేసాక్ష్యం. 1947 లో జరిగిన పాకిస్తాన్ విభజన దేశసమస్యలను పరిష్కరించకపోగా, దేశంలో హైదరాబాద్, ఆలీఘర్, కాశ్మీర్‌లాంటి అనేక పాకిస్తాన్‌ల ఏర్పాటుకు దారితీసింది.

కనుక మార్గాంతరం ఒక్కటే. ఈ మతతత్వ, దేశద్రోహ, విచ్ఛిన్నకర శక్తులను సమాజమే ఎదుర్కోవాలి. ఎక్కడికక్కడ వీటిని తల ఎత్త నీయకుండా తొక్కిపెట్టాలి. అదొక్కటే ఈ సమస్యకు పరిష్కారమార్గం.

* * *

